భారతీయ తాత్విక శోధకుడు

# రాహుల్ సాంకృత్యాయన్

రచన

తవ్వా ఓబుల్ రెడ్డి

మొబైల్ :94400 24471

ప్రచురణ

తెలుగు సమాజం : మైదుకూరు : కడప జిల్లా

,ఆంధ్రప్రదేశ్



రాహుల్ సాంకృత్యాయన్

జననం : ఏప్రిల్ 9,1893

మరణం : ఏప్రిల్ 14,1963

# అంకితం



## తిరుమల రామచంద్ర

ఆయనకు ఎలాంటి విద్యార్హతలు లేవు. అయితేనేం 30 కి పైగా భాషల్లో ప్రావీణ్యత సాధించాడు. వేలాది మైళ్ల దూరాన్ని కాలినడకన ప్రయాణించాడు. పేరుగాంచిన విశ్వవిద్యాలయాల్లో బోధనలు గావించాడు. భారత స్వాతంత్ర్యసంగ్రామంలో మూడుసార్లు జైలుకు వెళ్లాడు . సామాజిక, తాత్విక, చారిత్రక, మతగ్రంథాలతో పాటు ఆత్మకథ, జీవితచరిత్ర, నిఘంటు నిర్మాణశాస్త్రం, జానపద, కాల్పనికసాహిత్యాలు, శాస్త్రీయ అంశాలు, నాటకాలు, వ్యాసాలు విస్తృతంగా రాశాడు . వివిధ అంశాలపై కరపత్రాలను కూడా వెలువరించాడు. అందువల్లే ఆయనను మహాపండితుడని పిలిచారు. ఆయన పేరే రాహుల్ సాంకృత్యాయన్.!

ఉత్తరప్రదేశ్‌లోని అజాంగఢ్ జిల్లాలోని ' పాండహా ' గ్రామంలో హిందూ భూమిహార్ బ్రాహ్మణ కుటుంబంలో 1893 ఏప్రిల్ 9న రాహుల్ సాంకృత్యాయన్ జన్మించాడు. అసలు పేరు కేదారనాథ పాండే. చిన్న తనంలోనే తల్లి చనిపోయింది. తండ్రి గోవర్ధన్ పాండే వృత్తి రీత్యా రైతు. ఆయన కూడా తన 45 ఏళ్ల వయసులోనే కన్ను మూశారు. రాహుల్ తన అమ్మమ్మ దగ్గర పెరిగారు. తన స్వగ్రామంలోని ప్రాథమిక పాఠశాలలోనే స్కూలు విద్యను చదువుకున్నాడు. ఉర్దూ, సంస్కృత భాషల్లో ప్రాథమిక పరిజ్ఞానాన్ని అక్కడే ఔపోషణ పట్టాడు. తొమ్మిదేళ్ల వయసులోనే ప్రపంచాన్ని చూడాలన్న జిజ్ఞాసతో ఇల్లు వదిలి పోయాడు, రాహుల్. అనేక తాత్కాలిక ఉద్యోగాలు చేశాడు. కొన్నేళ్ల తర్వాత ఇంటికి తిరిగి వచ్చాడు. కొంత కాలం తర్వాత మళ్లీ తిరిగి వెళ్లిపోయాడు. సాధువులతో కలిసి తిరిగాడు. ధార్మిక మఠాల్లో సంస్కృతాన్ని అధ్యయనం చేశాడు. హిందీ, సంస్కృతం, పాళీ, కన్నడ, తమిళం, ఉర్దూ, భారతీయ

భాషలతో పాటు సింహళం, ఫ్రెంచ్, రష్యన్, అరబిక్, ఇంగ్లీషును కూడా స్వయంగా నేర్చుకున్నాడు. హిందీ భాషలోని భోజ్‌పురి, మాలవి,అవధి, మైథిలీ, బ్రజ్, రాజస్థానీ, నేపాలీ మాండలికాల మీద పట్టు సాధించాడు. ఫోటోగ్రఫీలో సైతం ప్రవేశం సాధించాడు. భారతదేశంలోని లడ్డాక్, కన్నౌర్, కాశ్మీర్ తోపాటు ఇతర యాత్రాస్థలాలన్నీ పర్యటించాడు. మద్రాసులో ఉన్నప్పుడు తమిళం నేర్చుకున్నాడు. తిరుపతి క్షేత్రాన్ని, కర్నాటకలోని హంపీ, బాగల్ కోట్, బెంగుళూరులను సందర్శించాడు.

ఆగ్రాలోని ఆర్య ముసాఫిర్ విద్యాలయలో సంస్కృతాన్ని బోధించాడు. హిందూ, ముస్లిం, క్రిష్టియన్ మత గ్రంథాలను అధ్యయనం చేశాడు. తన ఇరవైల్లోనే రాహుల్ రచనా వ్యాసంగాన్ని ప్రారంభించాడు. హిందీ, సంస్కృతభాషా పత్రికల్లో ఆయన ఎక్కువగా రచనలు చేశారు. జలియన్‌వాలాబాగ్ దురంతం (1919) రాహుల్‌లో జాతీయ భావాలను ప్రాదుకొల్పింది. ఆ సంఘటనతో భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నాడు. రాహుల్ బ్రి ిషీ వ్యతిరేక రచనలకూ, ఉపన్యాసాలకు ఆగ్రహించిన ఆ ప్రభుత్వం ఆయనను మూడేళ్లపాటు జైలులో ఉంచింది.

జైలులోనే ఖురాన్‌ను సంస్కృతంలోకి అనువదించాడు. జైలునుంచి విడుదల కాగానే బీహార్ వెళ్లి బాబూ రాజేంద్రప్రసాద్ తో కలిసి పనిచేశారు. రాజేంద్రప్రసాద్ ,రాహుల్ కు మంచి స్నేహితుడయ్యారు.గాంధీజీ పిలుపు మేరకు స్వాతంత్ర్య పోరాటంతో పాటు సామాజికసేవా కాక్యక్రమాల్లో పాల్గొన్న రాహుల్, అజాంఘఢ్ జిల్లా కాంగ్రెస్ అధ్యకక్షునిగా కూడా పనిచేశారు.

బుద్ధుని బోధనలను మూలభాషలో చదవాలన్న ఉద్దేశ్యంతో పాళీ, సింహళభాషలను నేర్చుకున్నాడు. బౌద్దమతం పట్ల పూర్తిగా ఆకర్శితుడై తన పేరును రాహుల్ సాంకృత్యాయన్ గా మార్చుకున్నాడు. రాహుల్ అన్నది బుద్దుని కుమారుని పేరు. ' సాంకృత్యాయన్ ' అంటే ' తనతో సమానంగా ఇతరులను కలుపుకొనెడివాడు ' అని అర్థం. రాహుల్ కు పెద్దలు బాల్య వివాహం చేశారు. రెండో పర్యాయం సోవియ్ రష్యా వెళ్లి అక్కడి లెనిన్ గ్రాడ్ విశ్వవిద్యాలయంలోని ఇండాలజీ విభాగంలో 1947-48లో బౌద్దమత ఆచార్యుడిగా పనిచేశాడు. ఆ సమయంలో మంగోలియన్ పరిశోధకురాలు 'లోలా' (ఎల్లెనా నర్వెర్తోవ్నా కోజెరోవ్స్కాయా) తో రాహుల్‌కు పరిచయం అయింది.(రాహుల్ 1937-38 లో కూడా అదే విశ్వవిద్యాలయంలో పనిచేశారు.) రష్యన్, ఫ్రెంచ్, ఇంగ్లీషు

భాషలను అనర్ఘలంగా మ్లాడటమే గాక సంస్కృత భాషను కూడా రాయగలిగిన లోలా, టిబెటన్- సంస్కృత నిఘంటువు తయారీలో తన సహకారం అందించింది. వారి మధ్య నెలకొన్న సాన్నిహిత్యం పెళ్లికి దారితీసింది. వారికి 'ఐగార్ ' అనే కుమారుడు కలిగాడు. అయితే రాహుల్‌తో కలిసి భారత్ రావడానికి లోలాకూ, ఐగార్‌కు అనుమతి లభించలేదు. తర్వాత రాహుల్ ఇండియన్ నేపాలీ మహిళ డా. కమలను వివాహం చేసుకున్నాడు. జయ అనే కూతురు, జేత అనే కుమారుడు కలిగారు. జీవితం ఎన్ని మలుపులు తిరిగినా ఆయనలోని పర్యటనోత్సాహం ఏమాత్రం చల్లారిపోలేదు.

ఎంతో కష్టతరమైన టిబెట్ పర్యటనను ఆయన చేపట్టారు. కాశ్మీర్, లఢాక్, కార్గిల్ ల మీదుగా కాలి నడకన ఆయన టిబెట్లో ప్రవేశించాడు. ప్రాచీన భారతీయ విశ్వవిద్యాలయాలైన నలంద, విక్రమశిల విశ్వవిద్యాలయాలపై 13వ శతాబ్దంలో భక్తియార్ ఖిల్జీ దాడులు జరిపి అనాదిగా కాపాడుకుంటూ వచ్చిన విలువైన సంస్కృత గ్రంథాలను కాల్చివేసిన నేపథ్యంలో భారతీయ సంస్కృతికి , ప్రత్యేకించి బౌద్ధమతానికి సంబంధించి సాహిత్యాన్ని వెలుగులోకి తీసుకురావాలన్నది రాహుల్ పర్యటనల ప్రధాన ఉద్దేశ్యం. ఖిల్జీ దాడుల కారణంగా కొన్ని విలువైన గ్రంథాలను కొందరు టిబెట్ కు తీసుకెళ్లి దాచిప్టోరు.టిబెట్ నుండీ విలువైన

గ్రంథాలతో పాటు ప్రఖ్యాతిగాంచిన 'థంకా' చిత్రాలతో రాహుల్ తిరిగి వచ్చాడు. వాటన్నిటి రవాణాకోసం 22 గాడిదలను వినియోగించాడు. (ఆ గ్రంథాలూ, చిత్రాలూ ప్నా మ్యూజియంలో రాహుల్ పేరిట ఏర్పాటైన ప్రత్యేక విభాగంలో ఉన్నాయి) ఆ తర్వాత కూడా రాహుల్ టిబెట్ లో మూడు సార్లు పర్యటించాడు. టిబెటన్ భాషను నేర్చుకోవడమే కాకుండా టిబెటన్ వాచకాలనూ, వ్యాకరణ గ్రంథాలనూ రచించాడు. టిబెటన్–హిందీ నిఘంటువును కూడా రూపొందించారు. (రాహుల్ మరణానంతరం ఈ నిఘంటువుమొది భాగం మాత్రమే ప్రచురించబడింది.)

ఆ తర్వాత శ్రీలంకలో పర్యించారు. ఆ తర్వాత జపాన్, కొరియా, చైనా, మంచూరియా లలో పర్యించి సోవియ్ రష్యా చేరుకున్నాడు.

' బాకూ ' పట్టణంలోని అగ్ని దేవాలయాన్ని రాహుల్ దర్శించాడు. అక్కడ దేవనాగరి లిపిలో ఉన్న ఒక శాసనాన్ని కనుగొన్నాడు. అక్కడ నుండీ అయన ఇరాన్, షిరాజ్, బలూచిస్థాన్‌లలో పర్యించి భారతదేశానికి తిరిగి వచ్చాడు.

భారత్‌లో తన రచనావ్యాసంగాన్ని కొనసాగించాడు. సంస్కృతంలో రాసుకున్న డైరీని తన జీవితచరిత్ర రాసుకోవడానికి ఉపయోగించుకున్నాడు. రాహుల్

సామాన్యునికి అర్థమయ్యే భాషలలోనే రచనలు చేశాడు. హిందీ, సంస్కృతం, భోజ్‌పురి, పాళీ, ిబెటన్ భాషలలో విభిన్న అంశాలపై ఆయన 146 గ్రంథాలను రచించాడు. కొన్ని గ్రంథాలు చాలా భాగాలతో కూడుకుని ఉండటం విశేషం. మరెన్నో గ్రంథాలు ప్రచురణకు నోచుకోలేదు.

రాహుల్ హిందీలో రాసిన ' ఓల్గా సే గంగా' గ్రంథం ఎంతో ప్రఖ్యాతి గాంచింది. క్రీ.పూ. 6000 సం. నుండీ క్రీ.శ. 1942 మధ్య అంటే 8వేల సంవత్సరాల చరిత్రతో కూడిన ఈ గ్రంథంలో ఆర్యులు యురేషియాలోని స్టెప్పీలనుండీ రష్యాలోని ఓల్గా నదీ పరీవాహక ప్రాంతాలకు రావడాన్నీ, అక్కడనుండీ హిందూకుష్, హిమాలయా ప్రాంతాలను దాటుకుని భారత ఉపఖండంలోని గంగా–సింధూ మైదాన ప్రాంతాలకూ విస్తరించడాన్నీ అద్భుతంగాచిత్రించాడు.

గాంధీజీ క్విట్ ఇండియా ఉద్యమానికి పిలుపు ఇవ్వడం దాకా జరిగిన చారిత్రక పరిణామాలను రాహుల్ ఈ గ్రంథంలో పొందుపరిచాడు. చారిత్రక సన్నివేశాలకు కాల్పనికతను జోడించి హృద్యంగా రచించిన ఈ గ్రంథం ఎన్నో భాషల్లోకి అనువదింపబడి ఇప్పికీ అత్యధికంగా అమ్ముడవుతోంది. తెలుగులో ' ఓల్గా నుంచీ గంగాకు ' అనే పేరుతో వెలువడింది. హిందీలో రుగ్వేద ఆర్య, కిన్నెర దేశ్‌మే, దర్శన్ దిక్దర్శన్,

బస్విన్‌సాడీ( 1923), జీనేకే లియే (1940), సింహసేనాపతి(1944), జై ఔధేయ (1944), భాగో నహీ, దునియాకో బదలే (1944), మధుర్ స్వప్న (1949), రాజస్థానీ రాణివాస్ (1953), విస్మృత్ యాత్రీ (1954), దివోదాస్ (1960), నవలలను రచించాడు. సాత్మీ కే బచ్చే(1935), బహురంగీ మధుపురీ (1953), కనైలాకీ కథా (1955-56)అనే కథలను రాహుల్ రాశాడు. 'నా జీవన యాత్ర' అనే పేరుతో ఐదు ఆత్మకథా సంపుటులను రచించాడు. ' దక్కని హిందీకా వ్యాకరణ్ ' ను వెలువరించాడు.

మహామానవ్ బుద్ధ, కారల్‌మార్క్స్, లెనిన్, స్టాలిన్, మావో సేటుంగ్, సర్దార్ పృథ్వీసింగ్, గుమక్కార్ స్వామి, వీర్ చంద్రసింగ్ ఘర్వాలీ, సింహళ గుమక్కార్ జైవర్ధన్, కేప్టెన్ హాల్, నయే భారత్ కీ నయే నేతా, మేరే అశాయోగ్ కే సాథీ, అతిత్ సే వర్తమాన్, బచ్‌పన్ కీ స్మృతియా, జిన్‌కా మై కృతజ్ఞా, తదితర జీవిత చరిత్ర గ్రంథాలు కూడా రాహుల్ కలం నుండీ వెలువడ్డాయి. భోజ్‌పురి భాషలో తీన్ నాటక్, పాంచ్ నాటక్ (1942) సంకలనాలనూ, టిబెటన్ భాషలో టిబెటన్ వ్యాకరణ్, టిబ్బతి బాలశిక్ష( 1933), పాఠావళి(1933), లను రాహుల్ రచించాడు. రాహుల్ సాంకృత్యాయన్ తన జీవితంలో దాదాపు 45 సంవత్సరాల కాలాన్ని ప్రయాణాల్లోనే గడిపారు. ముందు

బౌద్ధమతం వైపు, ఆ తర్వాత మార్క్సిస్టు సోషలిజం వైపు ఆయనఆకర్శితులయ్యాడు.

శ్రీలంక విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా పనిచేస్తున్న సమయంలో రాహుల్ తీవ్ర అస్వస్థతకు గురయ్యాడు. మధుమేహం రక్తపోటుతో పాటు స్వల్పంగా గుండె పోటు కూడా రావడంతో జ్ఞాపకశక్తిని కోల్పోయాడు. 1963 ఏప్రిల్ 14 వ తేదీన రాహుల్ డార్జిలింగ్‌లో తుదిశ్వాస వదిలాడు. ప్రఖ్యాత చరిత్రకారుడు కాశీప్రసాద్ జైస్వాల్ రాహుల్‌ను బుద్ధునితో పోల్చాడు. రాహుల్ వ్యక్తిత్వం ఆకర్షణీయమైనది. కృషి చిరస్మరణీయమైనది.

★★★

